బాలుఁడు.—మహాప్రసాదము. [అని సలాము చేసి పోయి కూర్చుండును.

[నైజాముకనుసన్న చేత దివాను నీలాద్రిరావునకు పన్నీరు చల్లును.

నీలాద్రి.—మహాప్రసాదము, మహాప్రసాదము !

నైజాము.—ఆడుదియు వీరులలో గణన కెక్కినది. ఈబాలుని కిది తల్లికన్న ఎక్కుడు. బాలునిం గాపాడినందున మాకు చాల మెహర్బత్తు చేసినది.

[అని హసేనాలీకి కనుసన్న చేయును.

హసేనాలి దాదికి పన్నీరు చల్లును.

దాది.—మహాప్రసాదము, మహాప్రసాదము !

నైజాము.—నీలాద్రిరావుగారూ. మీకోరిక తీరినదా ? ఇంక నే మయినం జేయవలయునా ?

నీలాద్రి.—

ఉ. వేంకటరాయనిం గనుఁగొనె కయికొంటిరి తల్లిదండ్రులై ;
యంకిలి యైన ద్రోహి తెగటాఱెను ; వీరులు పద్మనాయకుల్
బొంకరు కొంక రార్తులను బోషితు రటం చెద మెచ్చు కొంటిరే,
యింకను నేమి గోరుదు నహీనశయాన సమాన తెల్పుఁడా. 102

అయిన నిది యగుఁ గాక !

(భరతవాక్యము.)

శా. సర్వజ్ఞాంకిత సింహరాట్ప్రభవ వంశ ప్రాజ్య ముక్తామణుల్
గర్వోన్నద్ధ సపత్నభూమిధర పక్షచ్ఛేద నాఖండలుల్
ఉర్విం బోషితురు గాత శేషఫణిబాహుల్విచ్చలుం బోషితాం
తర్వాణీంద్రులు పద్మనాయకులు పద్మానాయకప్రాభవుల్. 103

[అందఱు నిష్క్రమింతురు.

బొబ్బిలియుద్ధనాటకము సమాప్తము.

